Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం॥ జనవరి నెల 30 వ తేది శుక్రవారం [నె 4 రు

## జపానువారి జలక్రీడలు.

జపాను సరుకు అంటే ఏమిటో, జపాను సరుకు ఎటువంటిదో మనకందరికీ ఇదివరకే చాలావరకు తెలుసు. జపాను పేరు చెప్పగానే జపాను సిల్కు వనకుతప్పకుండా జ్ఞాపకంవస్తుంది. మన బరంపురం పట్టుబట్టలు, మన బెంగళూరు, మైసూరు పట్టుచీరెలు, ఎంత చక్కని చిక్కని నేతగలవో, ఎన్నెన్ని పుష్కరాలు అవి చెక్కుచెదరకుండా ఉంటాయో చూడండి. జపాను సిల్కు గుడ్డలు ఎంత త్వరగా చినిగి చీలికలు వాలికలు అయిపోతాయో చూడండి. ఆగట్టిదనం, ఆమన్నుదల జపానుసిల్కుకు లేదు. జపాను సరుకు ఏదైనా అంతే. జపాను సరుకులో తళుకు బెళుకులు ఎక్కువ. నాణ్యం తక్కువ. ఆర్భాటం ఎక్కువ. పటుత్వం తక్కువ. కాని, ఆ తేడా తెలియనివాళ్లు జపానువాళ్లగారడీ సరుకు చూచి మోసపోతూ ఉంటారు. దిగ్భ్రమ జెందుతూ ఉంటారు. బ్రిటిషు సరుకు చూడండి. జపాను సరుకు చూడండి. ఏది గట్టిదో నిలకడ మీద మీకే తెలుస్తుంది. వ్యాపార ప్రపంచంలో తిరిగేవాళ్లకు ఇవన్ని క్రొత్త విషయాలుకావు.

ప్రస్తుతం జరిగే యుద్ధవ్యవహారాలలో కూడా ఎవరి యుద్ధతంత్రం గట్టిదో నిజం నిలకడమీదగాని తెలియదు. జపానుకు సామర్థ్యం తక్కువని చెప్పడానికి వీలులేదు. అంగబలం, ఆయుధ బలం కూడా సమృద్ధిగానే ఉంది. బుద్ధిబలం కూడా ఎక్కువగానే ఉంది. కాని, ఒక్కటే లోపం. దూరపు చూపు తక్కువ. శాశ్వతంగా, చిరకాలం కొనసాగే పద్ధతులుగాని ఏర్పాట్లుగాని జపాను వాడు ఆలోచించలేదు. శాశ్వతంగా చిరకాలం ఉండే వస్తువులూ చెయ్యలేదు. శాశ్వతంగా చిరకాలం అక్కరకువచ్చే ఆలోచనలూ చెయ్యలేదు. ఒక్క సూక్ష్మవిషయం ఆలోచించండి. జపాను వాళ్లు ఇంగ్లాండుతోను అమెరికాతోను స్నేహంగా ఉంటే జపానుకు ఎక్కువ స్థిరమైన క్షేమాభివృద్ధి కలుగుతుందా? జర్మనీతో సహవాసంచేసి జర్మనీతో కలిసి గంతువేస్తే జపానుకు యెక్కువ స్థిరమైన శాశ్వతమైన క్షేమాభివృద్ధికి అవకాశం ఉన్నదా? ఎవరితో సఖ్యతగా ఉండడం జపానుకు ఎక్కువ భద్రకరమైన క్షేమకరమైన విషయం? ఇది చాలా దీర్ఘంగా ఆలోచనచేసి, చాలా దూరదృష్టితో నిర్ణయించవలసిన విషయం.

ఒక్క ఉదాహరణ చూడండి. మామూలుగా మన సంసార విషయములలోనే, దూరదృష్టితో ఆలోచించవలసిన ఇటువంటి ప్రశ్నలు కొన్ని కలుగుతూ ఉంటాయి. మన పిల్లవాడికి ఏదైనా పెళ్లి సంబంధం నిర్ణయించవలసిన అవసరం కలిగిన దనుకోండి. మన పిల్లవాడికి ఉత్తరోత్తర అనేక విధాల అండగావుండి మన పిల్లవాడియొక్క కష్ట సుఖాలకు అక్కరకు వచ్చేటటువంటిన్నీ, మంచి సంప్రదాయం, మంచి గౌరవ ప్రతిష్ఠలు, మంచి ఆస్తివసతులు, మంచి అంగబలం కలిగినటువంటిన్నీ మర్యాద కుటుంబంలోని పిల్లను చేసుకుంటే ఉత్తమం. అట్లాకాకుండా, మన పిల్లవాడికి ఎవడో పెద్ద కట్నం యిస్తానని చెప్పినంత మాత్రంచేత ఆశపడి సంప్రదాయంలేని కుటుంబంలోని పిల్లను చేసుకోనడం క్షేమకరమేనా? ఏదో మృతనష్టపు ఆస్తి సంక్రమిస్తుందనే ఆశచేత, పరువు మర్యాద లేనివాళ్ల పిల్లను చేసుకోనడం క్షేమకరమేనా? మన సంసార వ్యవహారాలలో ఒక్కొక్క పెళ్లి సంబంధం నిశ్చయం చేసుకొనేటప్పుడు మనం ఎంతెంతదూరం ఆలోచిస్తాం? ఆదేవిధంగా, ఒక రాజ్యం ఇంకో రాజ్యంతో స్నేహబాంధవ్యాలు నిర్ణయించుకొనేటప్పుడుకూడా చాలా దీర్ఘంగా ఆలోచించాలి. పెళ్లి సంబంధాల విషయంలోకంటే, ఇంకా యెక్కువ దీర్ఘంగా ఆలోచించాలి. నెయ్యానికైనా అంతే. వియ్యానికైనా అంతే. తాత్కాలికములైన లాభనష్టాలను గమనించకూడదు. కొన్ని వందల యేళ్లవరకూ, దేశానికీ, దేశంలోవున్న ప్రజలకూ సుస్థిరంగా ఏది క్షేమకరమో ఆలోచించాలి. తమ జాతియొక్క నీతికి భంగం లేకుండా, తమజాతి శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లడానికి తగిన స్నేహబాంధవ్యాలు కల్పించడమే కట్టుదిట్టమైన రాజనీతి. అటువంటి రాజనీతి విషయంలో జపానువాళ్లకు దూరపు చూపులేదు. జపానువాళ్లకు అన్ని సామర్థ్యాలు వున్నాయిగాని, యీ సామర్థ్యం మాత్రము లేదు. అన్నీ వున్నాయిగాని అయిదోతనం లేదన్నట్లుగా వుంది. జపానుసిల్కుకు ఎంత మన్నుదల ఉన్నదో, జపాను రాజనీతికికూడా అంతే మన్నుదల ఉంటుంది. జపాను తత్వానికీ బ్రిటిష్ తత్వానికీ, ఇదే భేదం.

నిన్న బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారు పార్లమెంటు సభలో చెప్పిన ఉపన్యాసంలో రత్నమాణిక్యాలవంటి మాటలు కొన్ని యీ క్రిందివిధంగా చెప్పారు. "నేను అమెరికానుంచి బయలుదేరి వచ్చినప్పుడు అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు నా చెయ్యి గట్టిగా పట్టుకొని, ఎంత కష్టమైనా సరే, ఎంత నష్టమైనా సరే యీ యుద్ధాన్ని తుదముట్టేవరకు కొనసాగిస్తాము అని నాతో అన్నారు." అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారు బ్రిటిష్ ప్రధానికి స్వయంగా చేసిన వాగ్దానం ఇది. మీ ప్రాణాలకు మా ప్రాణాలు అడ్డంవేసి పోట్లాడుతాము అని అమెరికా ప్రభుత్వమువారు బ్రిటిష్ ప్రభుత్వంతో స్పష్టంగా చెప్పుతున్నారు. మాటలు అనడమే కాదు. అమెరికను సేనలను అప్పుడే ఇంగ్లాండుకు పంపించారు. అయిర్లాండులో అల్స్టరులో అమెరికను సేనలు దిగినవి.

చర్చిలుగారు ఇంకో మాటకూడా అన్నారు :—"ఏమైనా సరే, అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం యుద్ధంలోకి దిగుతుందని నిశ్చయమైతేనే తప్ప, జపానుతో తగాదా పెట్టుకోగూడదని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించుకొని ఆ ప్రకారంగానే నిన్న మొన్నటివరకు వ్యవహరించింది. కొంతకాలం క్రిందట, బర్మానుంచి చైనాకు పోయే బర్మారోడ్డుమీదుగా చైనాకు ఆయుధాలు సప్లయిచేయకూడదు అని జపానువారు అడిగితే, అందుకుకూడా బ్రిటిష్‌వారు ఒప్పుకొని, బర్మా-చైనారోడ్డుమీద అట్టి రవాణాలులేకుండా మూసివేయడమైనది. జపానువారు బ్రిటిష్‌వారిమీద కారాలు మిరియాలు నూరుతూ ఉన్నప్పటికీ, జపానుతో కయ్యంపెట్టుకొనడం యుక్తంకాదని బ్రిటిష్‌వారు తొలగి తొలగి ప్రవర్తించారు. ఒక ప్రక్కను ఇంగ్లాండుమీదనే యుద్ధము సంప్రాప్తమగుచున్న సమయంలో, అట్లాంటిక్కు మహాసముద్రంలో శత్రువులతో పోరాడవలసిన సందర్భంలో, ఉత్తరాఫ్రికా ప్రాంతంలోనూ, మధ్యధరా సముద్రతీర ప్రాంతాలలోను జర్మనులతో యుద్ధం చేయవలసిన సందర్భంలో, ఇటు సింగపూరు, బర్మా వగైరా ప్రాంతాలలోకూడా జపానును ఎదిరించడంకోసం భారీ ప్రమాణంగా యుద్ధసన్నా

హాలను బ్రిటిష్‌వారు చెయ్యడం ఎంతమాత్రమూ సాగేపనికాదు. జపానుయొక్క సైనికబలం కూడా ఎక్కువైనదే. డివిజను 1 కి సుమారు 25 వేల సైనికులు చొప్పున మోటారు వాహనాల మీద వెళ్లగల 70 డివిజనుల సేన జపానుకు ఉన్నది. ప్రపంచంలో మంచి యుద్ధ నౌకాబలంగల పెద్ద రాజ్యాలలో జపాను మూడవస్థానం ఆక్రమిస్తుంది. వీరావేశంగల ప్రజలు జపానులో 8 కోట్లుగాని 9 కోట్లుగాని ఉన్నారు. విమాన బలంకూడా జపానుకు ఎక్కువగానే ఉంది. కనుక యిటువంటి జపానువారి బలాన్ని ఎదిరించడంకోసం మన బ్రిటిష్‌బలాన్ని పసిఫిక్కు మహాసముద్రంలో వెదజల్లుకుంటే, అది మనవినాశహేతువేగాని, విజయసాధనమార్గంకాదు."

చర్చిలుగారు ఇంకొక ముఖ్యమైన విషయం చెప్పారు :—

"జపానువారు బ్రహ్మాండమైన యీ పసిఫిక్కు మహాసముద్రంలో అనేక ప్రాంతాలలో ప్రస్తుతం స్థావరం ఏర్పరచుకోవచ్చును. వారిని అక్కడ నుంచి లేవగొట్టుటకు మనకు ఇంకా కొంతకాలం పట్టును. ఇప్పుడు జపానువారిని అక్కడ అడుగు పెట్టనీయకుండా వెంటనే ఎందుచేత ఎదిరించ కూడదు అని మీరు అడుగవచ్చు. పసిఫిక్కు మహాసముద్రంలో లెక్కలేనన్ని లంకలు ఉన్నాయి, వాటిలో ఆయువుపట్లవంటి లంకలు వెయ్యింటికి 100 ఉన్నవనుకొందాము. ఒక్కొక్క లంకను రక్షించడానికి, ఒక్కొక్క లంకలో 1,000 మంది బ్రిటిష్ సైనికులను మకాముగా ఉంచినామనుకోండి. కాని ఆ లంకల ప్రాంతంలో స్థానబలము గల శత్రువు (అనగా జపాను) తన నావలతోను, విమానాలతోను దండెత్తివచ్చి ఆ లంకలలోవున్న సైనికులను పటాపంచలుచేసి ఆ లంకలను కొల్లగొట్టి, యిష్టారాజ్యంగా ఆ లంకలనన్నిటినీ ఆక్రమించుకోవచ్చు. ఆ సముద్ర ప్రాంతంలో జలక్రీడలాడినట్లుగా జపాను నావలు సమరకేళీవిహారం చెయ్యవచ్చు. ఆ లంకలన్నింటిలోను మనము 10 లక్షల సైన్యాన్ని ఉంచినప్పటికీ ప్రయోజనం లేదు. ఆ సైన్యాన్ని శత్రువుకు వృథాగా బలియిచ్చినట్లే అవుతుంది. కాని, నౌకాబలం విమానబలం ఎక్కువగా కలిగి సముద్రాధిపత్యం వహించే రాజ్యాల బలాబలాలు తారుమారైనరోజున, యీ లంకలలోనుంచి జపానువాళ్లు తప్పకుండా లేచిపోతారు. అటువంటి పరిస్థితులు తప్పకుండా త్వరలోనే ఏర్పడుతాయి."

జపాను చేసే ఆలోచనకూ, చర్చిలు చేసే ఆలోచనకూ వ్యత్యాసం గమనించండి. ఈ పసిఫిక్కు మహాసముద్రంలో లక్షోపలక్షలుగా లంకలు ఉన్నాయి. ఈ లంకల మధ్య జపానువారి సైనిక నావలు, యుద్ధనావలు స్వేచ్ఛాజలవిహారం చేస్తున్నాయి. "ఇక్కడ మనలనుచూచే మొగవాళ్లెవరూ లేరు" అన్నట్లుగా జపానువారు బావుటాలుపైకెత్తి, తెరచాపలు పైకెత్తి, ఇష్టమువచ్చినట్లుగా యీ లంకనుంచి ఆ లంకకూ, ఆ లంకనుంచి యీ లంకకూ తెప్పతిరునాళ్ల ఉత్సవాలలో తెప్పలు తిరిగినట్లుగా తిరుగుతున్నారు. కాని, యిక్కడ యీ జపాను గోపికల జలక్రీడలన్నీ అమెరికా యుద్ధనావలు దూరంగా ఉండి గమనిస్తూనే ఉన్నాయి. మిత్రమండలివారి విమానాలున్నూ జలాంతర్గాములున్నూ వీటిని పైనుంచీ, కిందనుంచీ ఒక కంటితో కనిపెట్టి చూస్తూనే ఉన్నాయి. డచ్చి యీస్టు యిండీసు దీవులలోని బోర్నియో దీవికీ సెలిబీసు దీవికీ మధ్యనున్న మాకాసార్ సముద్రంలో జపానువారియొక్క నావలు, చిన్నవిగాని పెద్దవిగాని రమారమి 100 నావలు ఇప్పుడు జలవిహారం చేస్తున్నాయి ఈ నావలలో జపాను సైనికులు ఉన్నారు. కొన్ని నావలలో జపాను సైనికులకు కావలసిన సామగ్రులు ఉన్నాయి. ఈ నావలకు కాపలాగా, వెంట తోడునీడగా, కొన్ని జపాను యుద్ధ నావలు ఉన్నాయి. ఈ మాకాసార్ సముద్రంలో జలవిహారంచేస్తున్న యీ జపాను నావలతో నాలుగు రోజులనుంచీ, సముద్ర యుద్ధం జరుగుతోంది. ఇంతవరకూ, ఆ నూరు జపాను నావలలోను 28 నష్టమైనాయి. బ్రహ్మాండమగు జపాను యుద్ధనావయొకటి అక్కడ సముద్ర స్నానం చేసింది. బహుశః అక్కడ సముద్రం ఎంత లోతు ఉన్నదో చూడాలని సముద్ర గర్భంలోకి వెళ్లిందేమో అది. ఈ లంకల మధ్య జపాను నావలు యీ విధంగా జలక్రీడలుచేస్తూ ఉండవలెనని చర్చిలుగారుకూడా కోరుతున్నారు. జపానువారి నౌకాబలం అంతా యీ పసిఫిక్కు మహాసముద్ర జలక్రీడలలో చూపిస్తూ ఉంటే చాలు. చర్చిలుగారు చెప్పినట్లుగా జపానుకు త్వరలోనే మోక్షం లభిస్తుంది. ఈ జపాను గోపికలు ఆయా లంకలలో ఒడ్డున భద్రంగా ఉంచిన జపాను పట్టు పుటములవంటి జపాను పటాలములన్నీ మిత్రమండలికి హస్తగతమై ఉంటాయి. తన నౌకాబలమంతా నీటమునిగిన పిమ్మట జపాను సిగ్గువిడిచి చేతులెత్తి 'స్వామీ! మాఅపరాధం క్షమించి, అజ్ఞానంలోపడిన మమ్ము ఆదరించి, మా మానంకాపాడవలెను' అని ప్రార్థిస్తే, యుద్ధానంతరం జరిగే సర్వప్రపంచ శాంతిసభలో జపానుకు కలిగిన అజ్ఞానమును పోగొట్టి, జపానుకున్నటువంటి జలక్రీడావ్యామోహం ఇకముందు తిరిగి కలుగకుండా చర్చిలు బందోబస్తు చేస్తాడు. చర్చిలు ఆ సంకల్పంతోనే ఉన్నాడు. అందుకనే నిశ్చలంగా జపానువారి యీ జలక్రీడావిహారమంతా వినోదంగా పైనవుండి చూస్తున్నాడు. అందుకనే, యీ జపాను జలక్రీడలన్నీ ప్రమాదకరమైన విషయాలుకావని చర్చిలు ప్రధాని పార్లమెంటు సభలో నిన్న నొక్కి వక్కాణించాడు.

సింగపూరులో మాత్రము బ్రిటిష్ సింహం భీకరంగా నరసింహావతారం చూపించ దలంచుకున్నది. అక్కడ జరిగేదంతా అగ్నిజ్వాలలతో పనిగాని, జలక్రీడలు కృష్ణలీలలుకావు అని బ్రిటిష్ ప్రధాని స్పష్టంగాచెప్పాడు. అందుకనే సింగపూరుకు బ్రిటిష్ సేనలను క్రొత్తగా తండోపతండములుగా పంపించారు. సింగపూరుకు ఎదురుగా ఉన్న డచ్చి యీస్టు ఇండీసు దీవులకు మిత్రమండలి సేనలువచ్చి దిగినట్లుగా నిన్న వార్త వచ్చింది.

చర్చిలు ప్రధాని చెప్పినట్లుగా మిత్రమండలివారి ప్రతాపం పూర్తిగా చూడాలంటే సింగపూరులో విశేషంగా ఏమీ కన్పించదు. అమెరికానుంచి పంపబడే యుద్ధ విమానాలన్నీ హిట్లరుమీదకే రాబందులవలె వస్తున్నాయి. అమెరికను పోరాట విమానాలు ఇంగ్లండుమీద తమ రెక్కలుచాచి ఎగురుతాయి. అమెరికానుంచివచ్చే బాంబువిమానాలన్నీ జర్మనీమీదకు వెళ్లి బాంబువర్షం కురిపిస్తాయి. జర్మనీని నిర్మానుష్యం చెయ్యగల బ్రహ్మాండమైన బాంబువిమానాలను అమెరికాలో అపారంగా నిర్మిస్తున్నారు. ఇట్లు ఇంగ్లండు వైపునుంచి అనగా పడమటివైపునుంచి అమెరికను విమాన బలం, సైనికబలం జర్మనీమీదికి విజృంభిస్తే, అటు తూర్పువైపునుంచి రష్యా తన బలమంతా అనంతంగా జర్మనీమీద చూపిస్తుంది. అటుయిటు కూడా జర్మనీని మద్దెల వాయించినట్లుగా వాయించడానికి తయారవుతున్నారు. ఇటుఅటుకూడా జర్మనీకి చర్మం పగిలే రోజులు వస్తున్నాయి.

రష్యాలో హిట్లరు తింటున్న దెబ్బ ఇంతా అంతా కాదు. గజగజలాడించే చలిలో ఏ మాత్రపు దెబ్బ తగిలినా ఎటువంటివాడైనా తాళలేడు. డిసంబరు 6 వ తేది జనవరి 15 వ తేది మధ్య 40 దినములలో 3 లక్షల జర్మను సేన నష్టమైంది. ఇద్దరు పెద్ద జర్మను సేనాధిపతులు రష్యా దక్షిణ భాగంలోని యూక్రేనులో చంపివేయబడినారు. జర్మను పటాలాలు రష్యాలోనుంచి మర్యాదగా పారిపోతే, ఇంత జననష్టం జర్మను సేనలకు ఉండేదికాదు. "బ్రతికియుండిన భాగ్యముల్ బడయవచ్చు—మాధవా మన రథంబు మరల నిమ్ము" అని తోకముడుతపెట్టి,—వచ్చినదారి చూచుకుంటే నిజంగానే బ్రతికిపోయేవాళ్లు. బ్రతికి ఉంటే బలుసాకైనా తినవచ్చు. కాని జర్మను సేనలు అట్లా పారిపోకుండా తమ్ము తరుముకొనివచ్చే రష్యనులమీదకు వెనుకకు తిరిగి మధ్య మధ్య ఎదిరిస్తున్నారు. ఎదిరించి ఎదిరించి ఎక్కడివాళ్లు అక్కడే చచ్చిపోతున్నారు. ఖోం అనే పట్టణం, టార్పెట్జు అనే పట్టణం జర్మనులు ఖాళీచేసినట్లున్నూ, వాటిని రష్యను సేనలు ఆక్రమించుకొన్నట్లున్నూ జర్మనులే ఒప్పుకొని ఆమాట నిజమని ప్రకటించారు. మాస్కో నగరాన్ని ముట్టడించాలని వెళ్లిన జర్మనులకు రష్యాలో యీ గతి పట్టింది. రష్యా ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలిను తన సైన్యాలను జర్మనులమీదకు వేటకుక్కలవలె పంపించి "ఇస్కో! ఇస్కో!" అంటున్నాడు. "మాస్కో లేదు, గీస్కో లేదు. నోరుమూస్కో—మళ్లీ ఇటువైపు వచ్చారంటే చూస్కో ఏం జేస్తామో!" అని అంటున్నాడు.

రష్యాలో జర్మను సేనలు ఎట్లా దెబ్బతింటున్నారో, చైనాలో జపాను సేనలుకూడా అట్లాగే దెబ్బతింటున్నాయి. టుంష్యానుండి జపాను సేనలను తఱిమివేసి దానిని చైనా సేనలు ఆక్రమించారు. అక్కడి జపాను సేనలు హంచూను వెప

పారిపోతున్నవి. హాంకాంగులో నున్నగ బ్రిటిషువారిని ఓడించి జపానువారు కొద్ది రోజుల క్రిందట దానిని ఆక్రమించారు. కాని యీ హాంకాంగులోని జపాను సేనలను పారదోలడానికి చైనా సేనలు దండెత్తి వస్తున్నాయి. హాంకాంగు సమీపంలో ఉన్న కౌలూనువద్దకు చైనా సేనలు చేరుతున్నాయి. చైనా సేనలు యింత సమర్థంగా యుద్ధంచెయ్యడానికి కారణమేమిటో గ్రహించాలి. అమెరికావారు చైనాకు బర్మాద్వారా ఆయుధాలు సప్లయిచేస్తున్నారు. బ్రిటిషువారు అమెరికావారు కలిసి చైనా సేనలచేత జపానును చావగొట్టించుతున్నారు. రష్యాకుకూడా బ్రిటిషువారు ఆయుధాలు సప్లయి చేసి జర్మను సేనలను అక్కడ మంచుగడ్డలలో మారణ హోమంచేయిస్తున్నారు. చర్చిలు ప్రధాని గారే యీ యుద్ధ తంత్రానికంతకూ ప్రధాన సూత్రధారుడుగా, విజయ సారథిగా పనిచేస్తున్నాడు. నన్ను "నమ్మిఉండండి" అని బ్రిటిషు పార్లమెంటులో నిన్న అన్నాడు. "నాకే ల్లాడదు బంధులార నిలుడీ క్రిందట ప్రమోదంబునట" అన్నట్లుగా మన కందరికీ అభయ హస్తమిస్తున్నాడు.

---

# చర్చిలు ప్రధాని యుద్ధ క్రమ సమీక్ష.

## పశిఫికు యుద్ధంలో వెనుకబడుటకు కారణములు తెల్పుట.

## అమెరికాతో కలసి తగు రక్షణ యేర్పాటులు చేయబడినవి.

బ్రిటిషు ప్రధాన మంత్రి చర్చిల్‌గారు యీ నెల 27 వ తేదిన పార్లమెంటుసభలో గత కొలది మాసములలో జరిగిన యుద్ధ క్రమమును సవిస్తరంగా వివరించి చెప్పిరి. శశిఫికు సముద్రమునందు, మలయాలో కొన్నిచోట్ల మిత్రమండలి సేనలు వెనుకకు మరలినందుకు, ప్రభుత్వంవారి యందు లోపములెంచుచు వెలువడిన విమర్శలకు జవాబుగా యీ ఉపన్యాసమునందు బాధ్యతయంతయు తమ మంత్రివర్గముదేనని వారు చెప్పిరి. ఏ ఒక మంత్రి లేక సేనానిపైగాని తప్పుయెంచి శిక్షింపదలచుకో లేదనియు వారు స్పష్టంగా తెలిపిరి. పశిఫికు ప్రాంతములకు ఎక్కువ సైన్యం పంపుటకు వీలులేక పోయినందుకు కారణం తెల్పుచు, యిపుడు అమెరికా సహాయంతో క్రొత్త సేనలు పరికరాలు పంపి రక్షణ యేర్పాటులు దిట్టపరచుతున్నామని తెలిపిరి. సభవారు తమ ప్రభుత్వమునందు విశ్వాసమున్నట్లు ప్రకటించాలని కోరేరు. ఈ విషయమై చర్చ మూడు రోజులు జరిగి విశ్వాస తీర్మాన మంగీకరించబడెను.

చర్చిల్‌గారు ప్రారంభమునందే పశిఫికు ప్రాంతముల యుద్ధంగూర్చి యిట్లు తెలిపిరి:—పశిఫికు సముద్ర ప్రాంతములనుండి యిటీవల మనకు చెడ్డ వార్తలు వస్తున్నవి. ఇంకను ఎక్కువగా అట్టి వార్తలే రావచ్చును, దూరదృష్టి లోపముచేతను, సత్వరచర్య జరుగకుండుటచేతనే యిటువంటి లోపాలు ఘోర నష్టాలు జరిగియుండుననుట ఎవ్వరు కాదనరు. కథ అడ్డంగా తిరిగింది, యింకా చెడుగుగా పరిణమించవచ్చును కనుకనే యిపుడు నేను నాయందు విశ్వాసమున్నట్లు సభలో ఓటు చేయగోరుచున్నాననిరి.

### రష్యాకు సప్లైలు—లిబియా యుద్ధము

రష్యా యుద్ధంగూర్చి తెల్పుచు, మూడు నాల్గు నెలల క్రిందట రష్యాపైకి జర్మను సేనలు దూకినపుడు లెనిన్‌గ్రాడు, మాస్కో, రసోష్టేవు నగరాలు వశమయిపోతాయో అని భయంగావుండెను. అందుచే రష్యా సేనలకు కోరిన ఆయుధ సహాయమంతా, కొంత ఆలశ్యంగా అయినా, పంపియుంటిమనియు, అందుకే రష్యా విజయంపొందగలిగెననియు చెప్పిరి. అదే సమయంలో జర్మను సేనలు రష్యాలో డాను నదిదాటి కాకసను రాష్ట్రంమీదుగ బాకు చమురు గనులు తీసుకొని టర్కీ, పెర్షియా, ఇరాకు, సిరియా, పాలస్తీనా దేశాల నాక్రమించి, సూయజు కాల్వ ఈజిప్టులనుకూడ బెదరించు ననుకొంటిమి. వీటికి పడమరను లిబియాలో జర్మనుసేనాని రోమెలుగారు ఇటలీ సైనికుల సహాయంతోకూడ నైలు నది లోయ నాక్రమించుటకు ప్రయత్నించుచుండెను. ఈ రెండు ప్రమాదాలను ఎదుర్కొనుటకు వీలగునంతవడిగా లిబియానుండి కాస్పియనువరకు శిబిరాలను రక్షించుటకు సైన్యాలను ఆయుధాలను పంపియుంటిమి. లిబియాలో టాబ్రుకును ముట్టడినుండి విడిపించి, సిరనైకా రాష్ట్రమును పూర్తిగ ఆక్రమించుకొని, రోమెలుగారి జర్మను సైన్యంలో 2/3 వంతు చంపుటో గాయపరచుటో ఖైదీలుగా పట్టుకొనుటో చేసితిమి. మన సైనికులు 18,000 మందిని కోల్పోయితిమి, అందులో ఎక్కువమంది బ్రిటిషువారే. శత్రువు మొత్తం 61,000 మంది సైనికులను నష్టపోయెను. జర్మనీ-ఇటలీ విమానాలు 852, టాంకులు 386 కూలిపోయినవి అచటి సముద్రంలో శత్రువుల సప్లై నౌకలెన్నో ముంచబడినవి. మనకన్న శత్రువు నష్టం మూడు రెట్లధికం. ఇది విజయమనండి కాదనండి, యీలాభసాటి బేరమునకు (నవ్వు) బ్రిటిషు, దక్షిణాఫ్రికా, న్యూజిలండు, ఇండియా, స్వతంత్ర ఫ్రెంచి, పోలిషు సైనికులు వైమానికులందరు కృషిచేసి ప్రశంసాపాత్రులైరని చర్చిల్‌గారు తెలిపిరి.

### పశిఫికు ప్రాంతం లోపాలు.

తూర్పున జపాను దాడినుండి మన రాజ్యాన్ని రక్షించుటకు తగిన ఏర్పాటులు చేయలేకుండుటనుగూర్చి చర్చిల్‌గారు తెల్పుచు, యిది చేసియుంటే బాగుండును అది చేస్తే బాగుండునని అందరు అనవచ్చును, కాని అమెరికా సంయుక్త రాష్ట్రములుకూడా యుద్ధంలో దిగేవరకు జపానుతో యీ మంత్రివర్గంవారు పోరుచేయదలచుకో లేదనిరి. అవతల ఇంగ్లాండును రక్షించుకొంటూ, అట్లాంటికులో నౌకా యుద్ధం సాగిస్తూ జర్మనీ ఇటలీలతో ఒంటరిగ పోరాడుచునే, ఆఫ్రికాలో శత్రువును విరోధించుచు, జపానువంటి పెద్ద సామ్రాజ్య సేనలనుండి బర్మా మలయాలను రక్షించుటకుగూడ తగిన ఏర్పాటులు చేయుట కష్టమనిరి. అంతదూరపు తూర్పు భాగాలకు తమ సేనలను విరజిమ్మియున్నచో యీపాటికి నాశనమయియుండుననియు, అప్పట్లో తూర్పు దేశాలందు యుద్ధం జరుగుచుండలేదనియు, అప్పటికింకా అమెరికా యుద్ధానికి సుముఖంగా లేకుండెననియు, యిపుడు పడినదెబ్బ తమ ఒక్కరిమీదనే కాక మిత్రమండలి దేశాలన్నింటిపైని పడినందున, అన్నికలసి యీ నష్టం పూడ్చుకొని, తిరిగి యిట్లు జరుగకుండ చేయగలవనియు చెప్పిరి. మరియు, నిరుటికన్న యీ యేడు అన్నిరకాల ఆయుధాల యుత్పత్తి రెండింతలయిందనియు, తెలిపిరి. అయితే యీ ఆయుధాలు విమానాలు తూర్పునకు చేర్చుటకు రవానా సౌకర్యములు స్టీమరు సౌకర్యములు చాలకుండుట ఒక పెద్ద ఆటంకంగానుండెను. అప్పటికి, జపాను ఎపుడో యుద్ధం చేస్తుందను అనుమానంతోనే ముందుగనే సింగపూరునకు 60,000 సైన్యాన్ని పంపియుంటిమనిరి. విమానాలు, టాంకులు, విమాన విధ్వంసపు ఫిరంగులు మున్నగునవి ముందుగ ఆఫ్రికాకు పంపియుంటిమనిరి. తూర్పున సింగపూరు ప్రాంతాలకు పంపకుండా లిబియాకు రష్యాకు పంపడం తప్పో ఒప్పో అప్పటి సందర్భములను బట్టి నిర్ణయించుకోవచ్చును. 1940 వ సంవత్సరములో ఇంగ్లాడు ఒంటరిగ యుద్ధం చేయుచు బలహీనంగానున్నపుడు ఇంగ్లాండుపై యుద్ధం చేయని జపాను, యిపుడు బ్రిటిషు సామ్రాజ్య అమెరికాల సమిష్టి సైన్యాలపై తెగించి యుద్ధం చేయడం బుద్ధి తక్కువగా కనబడకమానదు. తూర్పున యుద్ధంలేనపుడు వృథాగా ఇండియా, బర్మా, మలయా ప్రాంతములందు విశేష సైన్యం ఆయుధ పరికరాలను ఉంచి

యున్నచో సిరినైకాలో విజయం పొందియుండం, రష్యాకు సహాయం చేయలేకపోయియుందుము, అది సరియైన పద్ధతి కాదని చర్చిల్‌గారు చెప్పిరి.

పసిఫికులో జపాను పిచ్చిగా యుద్ధానికి దిగుతే మనం ఒంటరిగా ఉండమని అభయ మొసంగబడెను. వెనకా తల అమెరికాయొక్క ఆశియా నౌకా దళం ప్రక్కలో బల్లెంవలె యుండగా జపాను మలయాపైని, సింగపూరుపైని, డచ్చిదీవులపైని యుద్ధానికి దిగడం అసంభవంగానుండెను. అయినా దిట్టతనంకోసం "ప్రిన్సు ఆఫ్ వేల్సు, రిపల్సు" అను యుద్ధ నౌకలను పంపితిమి. తమకు చేరిన సలహా ప్రకారం సింగపూరును ఎక్కువగాను, హాంగుకాంగును కొంతవరకును, సరిపోవునని తలంచబడినంతవరకు, రక్షణ యేర్పాటులు దిట్టపరచితిమనియు, ఇంక నేదేదో చిన్న సహాయ కార్యాలు కాపుదల పనులు చేసియుంటిమనియు చెప్పిరి.

డిశంబరు 7 వ తేదిన జపాను ద్రోహం చేసి యుద్ధం ప్రారంభించి, అమెరికా నౌకాదళమును నిరుపయోగమొనర్చి, ప్రిన్సు ఆఫ్ వేల్సు, రిపల్సు యుద్ధ నౌకలను కొద్ది రోజులలో ముంచివేసి, తాత్కాలికంగా పశిఫికు ప్రాంతములందు నౌకాదళాధిక్యతను బడసిందనిరి. 'ఆ ఆధిక్యత ఎంతవరకు జపానువారి వశమందుంటుందో చెప్పలేముకాని, ఆ ప్రాంతములందు రాజ్యభాగాలున్న సమిష్టి జాతులన్నింటికి ఎక్కువ నష్టం జపాను కలిగించేవరకు, జపాను నౌకాదళా ధిక్యత ఉండునేమో ననిరి.

మలయాలోను సింగపూరు చేరువనందు యిప్పుడు జరుగుచున్న తీవ్ర యుద్ధములగూర్చి తెల్పుచు చర్చిల్‌గారు వాటి ఫలితంగూర్చి ఏమియు జోస్యం చెప్పనొల్లక బ్రిటిషు, ఆస్ట్రేలియా, ఇండియా సైన్యాలుకలసి ఆఖరి అంగుళం మేరవరకు రక్షించుటకు పోరుసాగింతురని తెలిపిరి.

డిశంబరు 17 వ తేదినుండి సైనికనివహములు మార్చబడినవనియు, తగిన కట్టుదిట్టాలు చేయబడినవనియు వాటి ఫలితాలు కొద్దివారాలలో తెలియగలవనియు చెప్పిరి. అమెరికాకుపోయి రూజువెల్టు అధ్యక్షునితో సంప్రదించినపుడు, నౌకలు మోయగల్గినంత యుద్ధసామగ్రియు, విమానాలను అన్ని ప్రాంతములనుండి పంపునట్లు ఏర్పాటు లాతడు చేసెననిరి.

## సమిష్టి ఆలోచనలు.

యుద్ధ వ్యూహములగురించి చర్చించుటకు బ్రిటను, ఆస్ట్రేలియా, న్యూజిలండు, డచ్చి తూర్పుదీవుల సైన్య ప్రతినిధుల సంఘం ఒకటి త్వరలో లండనులోనో వాషింగుటనులోనో జరుగగలదనియు, యుద్ధ మంత్రి వర్గమునందు ఆస్ట్రేలియా, కనడా, దక్షిణాఫ్రికా, న్యూజిలండు మున్నగు సామంత రాజ్యములకుకూడ ప్రాతినిధ్య మిచ్చుట కంగీకరించబడెననిరి. జపాను తాను ఆక్రమించిన సంపన్న ప్రదేశాలను భద్రపరచుకొనుచు, 1942-43 వ సంవత్సరంలోతనపై జరుగబోవు పెద్దపోటుకు రక్షణ ఏర్పాటులు చేసుకొనునుగాని, ఆస్ట్రేలియాపై పెద్ద దండయాత్ర జరుపుతుందనుకోననిరి. అయినా తమ శక్తివంచనలేకుండా ఆస్ట్రేలియాకు సహాయం చేస్తామనియు, సహాయం చేయవలెనని అమెరికాకు ప్రోత్సాహం చేస్తామనియు చర్చిల్ గారు చెప్పిరి.

తాము అమెరికాలో రూజువెల్టు అధ్యక్షుని చూచినపుడు 26 దేశాల సంఘం ఒకటి ఏర్పాటు చేసితిమనియు, హిట్లరు తత్వమును అన్ని మూలల విరూపంలోనున్నా పూర్తిగ రూపుమాపడమే ఆ సంఘం ఉద్దేశమనియు; జపానుపై యుద్ధంచేయుటకు ఆస్ట్రేలియా, న్యూజిలండు, ఇండియా, డచ్చిదీవులు అన్ని రక్షించుటకు చర్యలు ఆలోచింపబడినవనియు, ఆయుధ సామగ్రి సహాయం ఏర్పాటులు చేయబడినవనియు చెప్పిరి. 1942 లో జపాను వలన కొంత నష్టం కలిగినా కలుగవచ్చును, కాని త్వరలో పశిఫికులో నౌకాధిపత్యం ఆకాశంలో విమానాధిపత్యం తమకు లభించగలదనియు, 1943 లో తమ పని ప్రారంభించగలమనియు చెప్పిరి. జపాను ఓడితే హిట్లరు ఓడినట్లు కాదు, హిట్లరు ఓడితే అమెరికా బలమంతా జపాన్ను ఓడించుటకు కేంద్రీకరించవచ్చుననిరి. అంతేకాని పశిఫిక్కు యుద్ధమును అప్రాముఖ్యంగా యెంచలేదనిరి.

## రూజువెల్టు వాగ్దానం.

అమెరికా ఫైటరు విమానాలు బాంబరు విమానాలు బ్రిటిషు దీవులను రక్షించగలవనియు, జర్మనీపై దాడిచేయగలవనియు, అమెరికా సైనికులపుడే బ్రిటిషు దీవులకు కొందరు వచ్చిరనియు యింక కొందరు రాగలరనియు చెప్పిరి. తాను రూజువెల్టు అధ్యక్షుని విడచునపుడు అతడు తన చేయి పట్టుకొని "యీ యుద్ధం చివరవరకు, ఎంత ఖర్చయినాసరే కొనసాగించి తీరెదము." అని చెప్పినట్లు చర్చిల్‌గారు తెలిపిరి.

---

# జర్మనీ జాత్యహంకారం.

## ఇతరదేశాలవారిచే కూలిపని చేయించుట.

### వారికిగల కష్టాలు.

గడచిన సంవత్సరం సెప్టంబరు నెలలో లండనులో బ్రిటిషువారికి సహాయంగావున్న దేశాల అధికారవర్గ ప్రతినిధుల సభ జరిగింది. ఆ సభలో రష్యా ప్రతినిధియగు మెయిస్కీగారు జర్మనీ దారుణాలగురించి యిట్లా చెప్పేరు :—

"శాంతినికోరే ప్రజలు స్వాతంత్ర్యాన్ని కోరే ప్రజలు నాజీ దుండగములకు లోనై హింసపడుటను సహింపరాదు. హిట్లరు వర్గానికి చెందిన హంతకులు నఖశిఖ పర్యంతం ఆయుధాలు ధరించి అధికారం వహించదగ్గ పాలక జాతివారమను గర్వంతో, గ్రామాలు పట్నాలుపై దాడిచేసి, పచ్చగపండియుండు పొలాలను స్మశానాలుగను ఎడారులుగను మార్చివేస్తూ తామే ప్రపంచమంతా అధికారం వహించాలను దురాశతో వేలకొలది అమాయకులగు ప్రజలను తరిమివేయుటను సహింపరాదు."

### పోలండు ప్రజల కష్టాలు.

జర్మనీ ఆక్రమించిన పోలండులో జర్మను పాలకులు పోలీషు జాతిని అంతమొందించుటకు ఎన్నో క్రూరమయిన పనులు చేస్తున్నారు. జర్మను రైల్వే సామానులు దోచుకున్నారను నెపంమీద 22 పోలీషు రైల్వే పనివారిని చంపివేసినట్లు జర్మను రహస్యపు పోలీసుదళంవారు ప్రకటించేరు. 80,000 పోలీషు ప్రజలు చంపబడిరి. కొన్నివేలమంది విత్తులు కొట్టిన ఎడ్లవలె బిడ్డలు కనడానికి వీలులేకుండా చేయబడిరి. పడమటి పోలండులో వున్న ప్రజలు జర్మనీకి పంపబడ్డారు. జర్మను ప్రజలు వారి యిండ్లలో ప్రవేశపెట్టబడిరి. జకోస్లావోకియా, డచ్చి, నార్వే మున్నగు జర్మనీ ఆక్రమించిన దేశాల వారందరికి యిట్లాంటి హింసలేగలవు.

### కార్మికులను తీసుకపోవుట.

ఆక్రమించిన దేశాలలో అధికారం చలాయించడానికి తిరుగుబాటు చేయకుండా ప్రజలను అణచియుంచడానికి జర్మనులు ఎక్కువమంది కావాలి. కనుక జర్మనులను ఆపనులకు పంపితే, జర్మనీ దేశంలో యుద్ధంవలన కర్మాగారాలలోను యితరచోట్లను పనులు ఎక్కువై కార్మికులు చాలకున్నారు. అందుచేత ఆక్రమించిన దేశాలలోని కార్మికులను జర్మనీకి పంపివేసి జర్మనీ లాభం పొందుచున్నది. ఈ రీతిగ జర్మనీ ఫ్యాక్టరీలందును వ్యవసాయం పనులందును యిపుడు సుమారు 40 లక్షల విదేశాలపనివారున్నారు. జర్మనీ సైన్యంలో క్రొత్తవారు 80 లక్షలమంది కార్మికులు, వ్యవసాయదారులు చేర్చుకొనబడిరి. కావున దేశంలో కార్మికుల సంఖ్య తగ్గిపోయింది. జర్మనీ క్రొత్త దేశాలను ఎక్కువగ

## బ్రిటిషు టాంకులు.—



బ్రిటిషు సైన్యమునకు చెందిన టాంకులు న్యూజిలండు ప్రధాని వచ్చినపుడు ప్రదర్శింపబడినవి. ఈ టాంకులు ఉక్కు కవచంగల ఫిరంగి మోటారులు. ఇవి యెటువంటి నేలనైనా దాటిపోగలవు. ఇందున్నవారు బయటకు కనబడకుండా శత్రువుపై గుండ్లు ప్రేల్చగలరు.

---

ఆక్రమించిన కొలదీ ఆ దేశాలకు జర్మను సైనికులను జర్మను పోలీసులునే ఎక్కువగా పంపవలసి వస్తున్నది.

1941 వ సం॥ ఏప్రిల్ 1 వ తేదీసరికి జర్మనీలో యితర దేశాలనుండి వచ్చిన కార్మికుల సంఖ్యలు యీదిగువ రీతిగా ఉన్నాయి :—

| | | |
|---|---|---|
| పోలండు | ... | 873,000 |
| ప్రొటెక్టరేటు | ... | 150,000 |
| ఇటలీ | ... | 132,000 |
| హాలెండు | ... | 90,000 |
| బెల్జియం | ... | 87,000 |
| స్లోవోకియా | ... | 69,000 |
| యుగోస్లావియా | ... | 48,000 |
| డెన్మార్కు | ... | 31,000 |
| ఫ్రాంసు | ... | 25,000 |
| హంగేరీ | ... | 21,000 |
| స్విజరులండు | ... | 17,000 |
| సోవియటు రష్యా | ... | 10,000 |
| బల్గేరియా | ... | 8,000 |
| రుమేనియా | ... | 4,000 |
| నార్వే | ... | 1,400 |
| స్వీడను | ... | 1,200 |
| స్పెయిను | ... | 1,100 |
| గ్రీసు | ... | 500 |
| ఫిన్లండు | ... | 200 |
| పోర్చుగలు | ... | 100 |

ఈ కార్మికులుకాక, యుద్ధంలో పట్టుబడిన ఖైదీలు 14 లక్షలు కార్మికులవలె పనిచేస్తున్నారు, వీరిలో చాలమంది పొలాలలోను, తక్కినవారు పరిశ్రమలలోను పనిచేస్తున్నారు. ఏప్రిలు తరువాత రష్యాతో యుద్ధం తీవ్రమయింది. అందుచేత జర్మనీలోనికి విదేశీయ కార్మికులను యింకా ఎక్కువగ తేవలసివచ్చింది. గత ఆగస్టు మాసంసరికి మొత్తం 35 లక్షల విదేశీయులగు కార్మికులు పనిచేస్తున్నట్లు అంచనా వేయబడెను. రష్యాతో యుద్ధం ఎక్కువవుతున్నకొద్దీ జర్మను యుద్ధ పరిశ్రమలకు పని ఎక్కువవుతున్నది. ఇంతతో తేలిందా? జర్మనీ ఆక్రమించిన జకోస్లోవోకియా, పోలండు, ఫ్రాంసు, బెల్జియం దేశాలలో కూడ గనులందు, కర్మాగారములందు ఫ్యాక్టరీలందు కూడతగినంతమంది కార్మికులను చేకూర్చి జర్మనీకొరకే పనిచేయుచున్నారు.

ఇటలీగూడ ఆక్రమించిన దేశాలతో జమే ముసోలినియు అతని ఫాసిస్టు అనుచరులు తాము జర్మనీతో సరిసమానులమని ఎంత డాబులు చెప్పుకున్న వారి స్థితి అలాగేవుంది. ఈ కార్మికుల సంఖ్య విపరీతంగా లక్షలకొలది పెరిగిపోతున్నది. వారి కృషి నాజీ యుద్ధ యంత్రాలు తయారు చేయుటకుపయోగపడుచున్నది.

జర్మనీలో పనిచేయించుచున్న యీ విదేశ కార్మికులను మూడు విధాలుగ సంపాదించుచున్నారు :—(1) యుద్ధరంగమునందు పట్టువడిన శత్రు సైనికులగు ఖైదీలు, (2) బలవంతంగా వారి దేశాలనుండి లాక్కురాబడినవారు, (3) జర్మనీకి లొంగియున్న బలహీనపు రాజ్యాలతో ఒడంబడికల మూలంగా రప్పింపబడినవారు. ఫ్రాంసు, పోలండులనుండివచ్చిన కార్మికులు మొదటి రకంవారు. యుద్ధ ఖైదీలుగా పట్టుబ[illegible]టికి బ్రిటిషువారు జర్మనీకొరకు కూలిపనిచేయ నిరాకరించిరి. రష్యను కార్మికులు తమ జర్మనీవారితో కలసిపనిచేస్తే యేమి పరిణామం కలుగుతుందోయను భయంచేత రష్యనులచే ఎక్కువగ జర్మనీలో కూలిపని చేయించరు. విషీ ఫ్రాంసు ప్రభుత్వంతో రాయబారాలునడిపి

ఫ్రెంచి ఖైదీలను విడుదలచేసినట్లు జర్మనీ గొప్పలు చెప్పుకుంది. కాని యింతవరకు 2.00,000 మంది మాత్రం విడుదలచేయబడిరి. మొత్తం ఫ్రెంచి ఖైదీల సంఖ్య 1,800,000. మరి కొంతమందిని జర్మనీ ఆక్రమించిన ఫ్రాంసు భాగంలో పనిచేయుటకు విడుదలచేసిరి. ఫ్రెంచి సామ్రాజ్య దేశాల నుండి తేబడిన నల్లజాతి ఖైదీలను జర్మనీలో పనికి నియమించరు. జర్మను లార్యులయినందున ఆర్యజాతి యీ నల్లవారి సంపర్కంవల్ల చెడునని జర్మనీ ప్రభుత్వం అనుమానం. అందుచే ఆ ఖైదీలను ఫ్రాంసులోనే పనికి నియమించుచున్నది. జర్మనీ జాతిరంగు భేదములను యీ రీతిగ పాటించుచున్నది.

యుద్ధంలో ఖైదీలుగా పట్టుబడినవారిచే పని చేయించి, సాధారణంగా జర్మను కూలివారికిచ్చే కూలిలోనూటికి అరవయివంతే కూలి యిత్తురు. అందులోవారి భోజనం బస ఖర్చుల క్రింద కొంత, పన్ను క్రింద 1/10 వంతు తీసుకుందురు.

పోలండు, యుగోస్లావియా దేశాలవారికి యీ జీతాలిచ్చే పద్ధతేలేదు. వారిని బలవంతంగా యీడ్చుకొవచ్చి పనిచేయించడమే. పోలండు దేశీయుల యిండ్లవద్దకు జర్మను అధికారుల మోటారు లారీలువచ్చి, వారిని యిండ్లలోనుండి ఊడబెరికి జర్మనీకి పంపివేయడం తరుచు జరుగుచుండును.

### ఇటలీ కార్మికులు జర్మనీలో పని.

జర్మనీతో "స్నేహంగా" ఉన్నాయనబడే దేశాలనుండి కార్మికులను జర్మనీకి రప్పించే పద్ధతి వేరు. అవి పేరుకి స్నేహమేగాని, నిజంగా జర్మనీ కాలు క్రిందనలిగే రాజ్యాలే. ఈదేశ ప్రభుత్వాలతో ఒడంబడికల సంతకాలు జరుగుతాయి. లెక్కగ కొందరు కార్మికులను జర్మనీకి పంపుతామని ఆ ప్రభుత్వాలంగీకరిస్తాయి. ఆ కార్మికుల అంగీకారంతో పనిలేదు.

1937 వ సం॥ జూలైలో జర్మనీ - ఇటలీ ఒడంబడిక ప్రకారం ఇటలీ ఏటేట వ్యవసాయ కూలీలను జర్మనీకి పంపుటకు అంగీకరించెను. 1940 వ సం॥ జూలైలో ఆ ఒడంబడిక పునరుద్ధరింపబడి 20,000 పారిశ్రామికకూలీలు పంపబడిరి. 1941 వ సం॥ ఫిబ్రవరిలో రోము నగరంలో జరిగిన వేరొక ఒడంబడిక ప్రకారం వెంటనే 54,000 పంపబడిరి; తరువాత 150,000 మంది పంపబడిరి. ఒడంబడికలో వ్యవసాయ కూలీలు 60,000 మందిని పంపాలని ఉంది. స్పెయిను, రుమోనియా, హంగేరి, స్లోవాకియా మున్నగు దేశాలతోగూడ జర్మనీ యిటువంటి ఒడంబడికలు చేసుకుంది. ఇటలీ వారంటే జర్మనీ వారికెపుడు హేయభావమే.

### జాతినిబట్టి కూలి.

ఇక ఆ విదేశ కార్మికులకు జర్మనీలో యిచ్చే కూలి భత్యాలగూర్చి ఆలోచిద్దాం. పేరుకి జర్మను కార్మికుల కెంత జీతం యిస్తారో విదేశ కూలీలకు కూడా అంతే యివ్వబడును. స్లోవకు, హంగేరి, డేను జాతులవారు తమ కూలిలోనుండి పన్నులివ్వనవసరంలేదు. కార్మికులు సమిష్టి బారకాసులలో నివసింతురు. దేశంవారీగా ప్రత్యేక నివాసములు కేటాయించి యుంటాయి. వారి స్వదేశాలలలో (డెన్మార్కులో తప్ప) దొరికే భత్యాలకన్న యిక్కడ యెక్కువగానే లభిస్తవి. పని ఆరు నెలలవరకే గుత్తపనిగా వుంటుంది. పెండ్లైన కార్మికుడు ఆరు నెలల కొకసారి సెలవుపై స్వదేశంలో యింటికి పోవచ్చును; బ్రహ్మచారి ఏడాదికొకసారి పోవాలి. సెలవాఖరుకి రాకపోతే చాల కష్టాలుంటాయి. స్వదేశంలో భోజనానికిచ్చే రేషను టిక్కట్లు యివ్వరు. అంతేకాక యింకా కఠినమయిన శిక్షలుకూడా వుంటాయి. భీమా చేసుకొన్న సౌకర్యాలు తొలగిపోతాయి. పనివారు తమ దేశాలకుపోయి జర్మనీలో చెడ్డస్థితిని గూర్చి ప్రచారం చేస్తే స్వదేశం ప్రభుత్వంవారే శిక్షించవచ్చును. దేశాన్నిబట్టి కార్మికుల సౌకర్యాలుకూడ మారుతూ వుంటాయి. పోలండు దేశీయులు స్వతంత్రులుగ పేర్కొనబడ్డా ఖైదులు పనిచేసినట్లే పనిచేయాలి. పోలిషు కూలివారిని జర్మను కుటుంబాలలో సరిసమానంగా చూచి చెంత కూర్చుండబెట్టుకున్నను, హోటల్సులోకి రానిచ్చినను దారుణమగు శిక్షలు విధించబడును. డెన్మార్కు పనివారికి ఎక్కువ సౌకర్యము లుండును. ఇటలీ కార్మికులకు వారి దేశంనుండే మంచి ఆహారం వచ్చును. ఇటలీ ప్రభుత్వోద్యోగి ఒకడు గత ఆగస్టులో జర్మనీలో సంచారంచేసి తనిఖీచేసిన పిమ్మట ఇటలీ కార్మికుల స్థితి బాగుపడినదట.

జర్మనుల జాతిగర్వం యీ రీతిగ పని చేయుచున్నది. విదేశీయులను ఈ రీతిగ తమదేశంలో కూలి పని చేయిస్తుంటే, జర్మనీ ఆక్రమించిన దేశాలలో ప్రజలు తీవ్రమయిన క్రోధంతోను, అశాంతితోను కుములుచు తిరుగబడుతున్నారంటే ఆశ్చర్యం ఏముంది ?

---

# భారతీయ సైనిక శిక్షణ పాఠశాలలు పెరుగుట.

### నెలకు 50 వేలమంది క్రొత్త సైనికులు.

### నేడు పదిలక్షల సైన్యం గలదు.

భారతదేశంలో సైన్యం యుద్ధంలేని శాంతిసమయంలో ఇండియా సరిహద్దులందు కొండజాతులను అణచియుంచుటకు, దగ్గర శత్రువులనుండి కాపాడుటకు మాత్రమే సరిపోవునంత చిన్నదిగా నుండెను. దానిని, మహాయుద్ధమునందు పనికి వచ్చే ఆధునిక యుద్ధప్రక్రియల పెద్ద సైన్యంగాను, ఇండియాయొక్క దూరపు రక్షణ శిబిరాలగు ఈజిప్టు, అబిసీనియా, ఇరాకు, సిరియా, ఇరాను, మలయాలకు పంపుటకు తగినంతదిగాను పెంచుటంతా రెండేండ్లలో జరిగింది.

1939 వ సంవత్సరం ప్రారంభంలోనే సైన్యాన్ని పెంచవలసిన అవసరం గుర్తించబడెను. ఆ యేడు యుద్ధం ప్రారంభంకాగానే సైన్యాభివృద్ధికి యత్నాలు ప్రారంభించబడి జయప్రదంగా కొనసాగాయి.

యుద్ధం ప్రారంభమయిన మొదటి ఎనిమిది నెలలలో 53,000 వేల మంది క్రొత్త సైనికులు చేర్చుకొనబడ్డారు. 1940 వ సం॥ మార్చిలో 1,00,000 మందిని అధికంగా చేర్చుకోడానికి తలపెట్టేరు. ఆ యేడాఖరికి అంతమందీ చేరేరు. ఇండియాలోనున్నవార్నూ, విదేశాలకు పంపబడిన సైనికులు కలిపి 5,00,000 వరకు పెంచుటకు వీలుందని 1941 వ సంవత్సరములో తెలిసెను. మార్చి ముగిచులోగా మూడు నెలలో ఇండియాలో వున్న సైనికులే అనుకున్న 5 లక్షలు మించినట్లు ప్రకటించబడెను. అప్పటినుండి నెల 50,000 మంది చొప్పున క్రొత్త సైనికులు చేర్చుకొనబడుచున్నారు. అందువలన నేడు ఇండియాలో సుమారు 10 లక్షలమంది సిపాయిలు గలరు.

కాని సైనికుల సంఖ్య యెంత పెంచాలనా వారికి కావలసిన ఆయుధసామగ్రి, వారికి శిక్ష

యివ్వగల సుశిక్షితులగు సైనికులు, శిక్షణ పాఠశాలలు తగినన్ని యుండుటవసరం. సుశిక్షితులైన తరిఫీదయిన సైనికోపాధ్యాయు లెందరున్నారో చూచుకొని వారికి తగినంతవరకే శిక్షణకేంద్రాలను పెంచవలసివచ్చెను.

ఈ క్రొత్త భారతసేనకు నాయకత్వం వహించగల ఉద్యోగులు కావలసివచ్చెను. అందుకొరకు అర్హతగల భారతీయ యువకులను అన్ని రకముల సైనికోద్యోగములందు అమితంగా తరిఫీదు చేయవలసివచ్చెను. క్రొత్త శిక్షణ పాఠశాలలు స్థాపించబడెను. ప్రాతవి పెద్దవిచేయబడెను.

మూవు, బెంగుళూరులందున్న సైనికోద్యోగుల శిక్షణాలయములందు యిదివరకుకన్న ¼ వంతు యెక్కువమంది కొద్ది మాసములలో తరిఫీదు చేయబడిరి. ఇపుడు సాలీనా 2,600 మందికన్న యెక్కువమంది ఉద్యోగులు తయారగుచున్నారు. నేటి యుద్ధమునందు మనుష్యులకన్న యంత్రాలకు యెక్కువ వుపయోగంకలదు. కావున సేపర్లను యంత్రసామగ్రి వాడుకచేసేవారిని తయారుచేయుటకు క్రొత్తగ ఇంజనీరింగు ఆఫీసర్సు ట్రెయినింగు స్కూలు ఒకటి స్థాపించబడెను.

ప్రాత సైనిక పాఠశాలలలో డేరాడూనునందున్న ఇండియను మిలిటరీ అకాడమీలో యిదివరకుకన్న మూడింతలు యెక్కువమంది తయారవుతున్నారు. ఫైటింగు వెహికిల్సు స్కూలులో (యుద్ధ శకటాల పాఠశాల) నిరుడో క్రొత్త తరగతి చేర్చి యిదివరకుకన్న నూటికి 60 వంతు యెక్కువ మందిని తరిఫీదు చేయుచుండిరి. అట్లే ఇం[illegible] స్కూలు, ఆర్మీ సిగ్నలు స్కూలు, కా[illegible] స్కూలు (అంటే యుద్ధ శిబిరాలు కన[illegible] రంగులువూయడం నేర్పే పాఠశాల) [illegible] కమిషను, నాను కమిషను ఆఫీసరులను [illegible]రు చేసే స్కూలు, ఇండియను హాస్పిట[illegible]రు, యివన్నీగూడ పెద్దవిచేసి, నానాటికి యెక్కువ మందిని తయారుచేయుచున్నారు.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]